# పాంచ - జన్యం

(గేయ-కవితా-సంపుటి)



ప్రచురణ

వేదోపనిషత్ - వేదిక

ప్రశాంతినగర్

పెందుర్తి - విశాఖపట్టణం

ఆంధ్రప్రదేశ్

# పాంచ జన్యం
(కవితలు)

# PANCHJANYAM
(Poetry)

**written by**
**Prajakavi Vangapandu Appalaswamy**
Principal (Rtd)
Founder Correspondent
T. Subbaramireddi National Junior College
PENDURTHI - 531 137
Visakhapatnam (AP) Ph : 824428

ప్రతులు 1000
ప్రథమ ప్రచురణ 1987
రెండవ కూర్పు 1997


ముద్రణ



వెల రూ॥ 25/- లు

# అంకితం

జననీ - జనకులకు

అక్షరంపొలి తెరుగని - ''మా అమ్మ-గంగమ్మ''
సాత్త్విక - ప్రవృత్తికి - నివృత్తి.
నిరక్షరకుక్షి-''మా అయ్య అప్పుడు''
తామసిక ప్రవృత్తికి - తరగని గని.
రాజసిక ప్రవృత్తికి - రూపమిచ్చి
నా జన్మకు జాగృతి తొడగిన
అమ్మా-నాన్నలకె అంకితం
నాయీ రచన పాంచజన్యం.

పెందుర్తి
**2-10-97**

**ప్రజాకవి - వంగపండు**
పెందుర్తి
విశాఖపట్టణం

# ప్రజాకవి-వంగపండు

మనవి

సమాజానికి-సాహిత్యం ద్వారా-సేవ జేయాలన్న-సత్సంకల్పంతో, శ్రీకారం చుట్టి, వివిధ సాహిత్య ప్రక్రియలలో ఖండకావ్యం, గేయకవిత్వం, నాటకం, శతకం, అనువాదం, జీవిత చరిత్రలు, ఇరువది మూడు గ్రంధాల్ని, సామాజిక సమస్యల్ని, ఇతివృత్తాలుగ, నిలిపి రచించితిని. మూడుదశ బ్దాల కాలపరిమితిలో, వివిధ ప్రచురణ సంస్థల వలన, ఇవన్నియు- ప్రచురించబడినవి.

కాల గమనంలో, ఇందుకు నేను పొందిన, అందిన, సన్మానాలు- బహుమతులు- ఒక ఎత్తు, "నా రచనలు - జీవితం-పం౹౹" - ఆంధ్రాయూనివర్శిటీ- వారు దరిమిలో, వెలువరించిన రెండు పరిశోధన గ్రంధములు ఒకఎత్తు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, వారిచే **25**వేల రూపాయిల్ని ధనసహాయం పొంది, ముద్రించబడిన నే రచించిన- " ఆచార్య చాణుక్య-చంద్రగుప్త" నాటకముపై, డా, యుం. జయదేవ్ పర్యవేక్షణలో శ్రీ,, వి. ఇంద్రసేనరావు చేసిన పరిశోధన గ్రంధమునకు **1995**లో ఆంధ్రాయూనివర్శిటి వారు-యుం. ఫిల్ డిగ్రీని ప్రధానం చేసారు.

అంతేగాక-నేను రచించిన రచనలన్నింటిపయి ఆంధ్రాయునివర్శిటి రీడర్, డా. వి. సిమ్మన్న పర్యవేక్షణలో, లెక్చరర్, శ్రీమతి జెల్లి-సరోజినీదేవిగారు, "ప్రజాకవి-వంగపండు-రచనలు-జీవితం". ప్రధాన శీర్షికతో - సమర్పించిన సిద్ధాంత గ్రంధమునకు **1996**లో, ఆంధ్రాయూనివర్శిటీ, పి. హెచ్. డి. డిగ్రీని- ప్రధానం చేసారు.

ఇన్నేండ్లకు - ఇన్నాళ్లకు నా సాహితీపంట పండింది. నా కవిత, ''ప్రజా చైతన్యకరదీపిక'' అని- సాహితీ లోకంతోపాటు -ఆంధ్రాయూనివర్శిటీ గుర్తించింది.

నన్ను-'' ప్రజాకవి-వంగపండు''అని ''నా రచనలు-జీవితం పై'' విశ్లేషణ జరిపిన- పరిశోధన కర్తలు- పేర్కొనడం, నాకెంతో ఆనందకరమైన విషయం. నా నిరంతర నిర్విరామసాహితీ కృషి,పర్యవసిత ఫలం,నా గతజన్మ సుకృతం.

బొత్తిగ సాంప్రదాయక, సాహితీ పరిజ్ఞానం లేక, తరతరాల మన సంస్కృతిని నిర్లక్ష్యించడంచేతగాక-రకరకాల ఆలోచనల మత్తులో, నేటి యువతరం ''తమస్సు''లో పడి-''రజస్సు''ను-''ఉషస్సు''ను- కోల్పోతున్నది.

తలోదారినేగుచున్న-ప్రపంచాన్ని-ఏకదారిని నడిపించడం-కేవలం ''మాటలతెలివి''వలన సాధ్యంకాదు. మరల మన''రాతను-చేతను-గీతను'' పునర్వికసింపజేస్తేనే తప్ప-మానవజన్మ సార్థక్యానికి బలమైన పునాదులేర్పడవు.

''కర్మ జ్ఞానానుభవ సిద్ధాంతము''ను-(Theory of Action Devine-spirit జనుడు- అర్జునుడు- జనార్ధనుడు) దిక్సూచిగ నిలుపు,నా సాహితీప్రయత్న పర్యవసిత రూపమే నాయీ పాంచజన్యం. గేయకవితాసంపుటి.

**1987**లో ప్రథమ ముద్రణనొందిన నాయీ పాంచజన్యం-మరల **1997**లో ద్వితీయకూర్పులో, చేర్పుల్ని- మార్పుల్ని, సంతరించుకోవడం, ఎంతో శుభావహం-ముదావహం-ఇందుకు ఆంధ్రపాఠకమహాశయులెల్లరికి నా మనఃపూర్వక వందనాలు-అభినందనాలు-నా సాహితీకృషిని అభినందించిన- తిరస్కరించిన అందుకు తీర్పరులు మీరే.

మీ ఆదరణాభిలాషి
ప్రజాకవి - వంగపండు
పెందుర్తి.

# పాంచ జన్యం

## (గేయం కవితలు)

ఇందులో

1. పాంచ జన్యం
2. జయభేరి
3. ధర్మం
4. ప్రకృతి ప్రవృతి
5. తూర్పు పడమరలు
6. సత్యం శివం సుందరం
7. తేజస్సే - నా తపస్సు
8. ద్విముఖ - చిత్రం
9. పాత్రధారి
10. బ్రహ్మ-సంతతి
11. అదృష్టరేఖ
12. ఆనందం - విషాదం
13. ఆచార్యుడు
14. కాంతిరేఖలు
15. మాయ
16. గడ్డిబొమ్మ
17. ఆస్థాన పీఠం

# పాంచ జన్యం

## (గేయకవితలు)

# పాంచ జన్యం

హృదయ దుర్బలుడు - జగతి క్షుద్రుడని-
సంశయాత్ముడిల - స్థిరుడు కాడని-
''కర్మ'' కౌశలమే - ధరణి యోగమని-
కవితను గానం చేస్తానోయ్
పుడమికి - పుణ్యం పూస్తానోయ్
''ఆత్మ'' జగతికి - ప్రాణ దీపికని-
మనసే - మనిషికి - మూలసూత్రమని
జీవన విలువకు - ప్రాణంపోసి
రేపునీదనే - పీఠంవేసి-
నిజమనిపిస్తా ! ధ్వని వినిపిస్తా !
స్మృతి ధర్మం - ప్రకటిస్తానోయ్
నీచ సంస్కృతిని - నిలువునపాతి
జాతి సంస్కృతిని - జాగృతిపరచి
ఆత్మోద్ధరణే ''ముక్తి'' మార్గమని
అఖిల జగత్తుకు వినిపిస్తానోయ్.

# జయంభేరి

గణ గణ గంట మ్రోగించిన-
జనగణ విభజన - జరిపిన-
లేదనిన - మనసును - అనిపెట్టలేం
కాదనిన - మనిషిని - గురిపెట్టలేం
''గుడి''లో మొలచిన ఆత్మను విడనాడిన
''బడి''లో నిలచిన ఆచార్యుని - తెగనాడిన
భావి గతిని వినిపించలేం
కాలగతిని తిలకించలేం
కల్పనాశిల్పాన్ని - కనిపెట్టిన
కట్టు కథల్ని - నిలబెట్టిన
అనృతానికి - అద్దం పట్టలేం
సత్యానికి - సమాధి కట్టలేం.

# ధర్మం

''ధర్మం'' త్రయావిధం
తామసికం - రాజసికం - సాత్త్వికం
జీవితం త్రివిధాత్మకం
''ఉనికి - మనుగడ - వికసన''
జీవిత ధర్మాలు - మూడు.
ఉనికికి - తమస్సు
మనుగడకు - రజస్సు
వికసనకు - సత్
స్వస్వభావ - సుస్వరూప
నిజకర్మాచరణ - ''ధర్మం''
అనంత విశ్వంలో - దిగంత పర్యంతం
దివ్యానుభవమే - దిక్సూచి
జీవన సంద్రాన్ని దాట
''ధర్మం'' - ఒక తెప్పని తెలుసుకో
నెత్తిని - పెట్టుకొని
ఊరేగిన - అది
ముప్పని - మసలుకో.

# ప్రకృతి - ప్రవృత్తి

"ప్రకృతి" - వికటించిన - "ప్రళయం"
పరవశించిన - "ప్రణయం"
"ప్రవృత్తి" విజృంభించిన - "ప్రమాదం"
వికసించిన - "ప్రమోదం"
"విశ్వం" - వీటిని - విడదీయను కలదు
ముడి వేయను కలదు
విరుద్ధ లక్షణాల "కూటమి"
చురకిడు - జ్యోతిని - వెలుగు జనించును
జలమిడు - మేఘని - పిడుగు వరించును
వెలుగిడు - సూర్యుడు - రేయి నిచ్చును
బ్రతుకిడు నీరే నరుని హరించును
నీటిలో అగ్ని నిలచి జూచును
నీరే అగ్నిని ఆర్ప జూచును
చావు - పుట్టుకను - సంహరించును
పుట్టుక - చావును - నెట్టివేయును

# తూర్పు - పడమరలు

రెమ్మకు పూవులా
వికసిస్తాడు - ఆశావాది
రాలిన ఆకులా
తూలిపడతాడు - నిరాశావాది
ఆశావాది నయనాలు
అద్భుత - కాంతి కిరణాలు
నిరాశావాది కళ్లు
నిట్టూర్పు - తరంగాలు
కనిపించని జగతిని - కళ్లజూస్తారొకరు
కనిపించినపుడమిని - కళ్లమూసుకొంటారొకరు
ఆశావాది అధోగతిని అన్వేషించడు
నిరాశావాది నింగికి - చూడడు
ఒకరీ జగతికి - బరువు
ఒకరీ పుడమికి - కల్పతరువు.

# సత్యం - శివం - సుందరం

ప్రకృతి నెంత ప్రశ్నించిన
పరమాత్మ పలకదు
''జడం'' నుండి ప్రభవించిన
''నరజన్మే'' ఒక జవాబు
అనుభవాన్ని నెమరువేయు
ఆత్మశక్తి - కలకాదు
నిన్ను నీవు - తెలియక
నిలుచుట - అపవాదు
కత్తి పట్టి కదలనీకు కాంతిరేఖ కనబడున?
విత్తొకటి - చెట్టొకటి - విశ్వంలో కనరానిది!
నిన్ను నీవె - తిట్టుకొనిన-
నిలువున - చెడతావు
ఆత్మజ్యోతి నార్పివేయ-
నగాధంలో పడతావు.

# తేజస్సే - నా తపస్సు

కర్మ - పశువుల్ని - కాస్తే
ఊహ - ఊళ్ల - నేలడమ్మా! నవ్విందిలోకం
కోళ్ళు - తోలమని చెపితే
కోటలోని కబుర్లెందుకు - తిట్టారుజనం
పశువుల్ని కాయడం - కోళ్ళుతోలడం
తామసికుని కర్మలు - కష్టంతో - కూడినవి
ఊళ్ల నేలడం - కోటలోని కబుర్లువినడం
రాజసికుని కర్మలు - సుఖాలతోనిండినవి
కష్టాలకూడలి - ''శరీరం''
సుఖాలశిబిరం - ''ఆత్మ''
శరీరం - జ్ఞానవిజ్ఞాన సంభవం
ఆత్మ - అనంత ప్రకాశిక
ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి - నాలోనిలచి
జీవనాక్షరాల్ని నేర్ప
భావికి త్రోవదొరికి
మనోధైర్యం పెరిగి - కృషిజరిగి
తేజస్సే - నా తపస్సు గనిలచింది.

# ద్విముఖ - చిత్రం

నిజమేలే - తర్కానికి
ఇరువైపుల - కర్కశకాంతులు
పునర్జన్మకు - పునాదిలేదు
ఆరినదీపం - మారినతార
నిజమేలే - భావానికి
ఎదురెదురు - ప్రయాణాలు
పాపపుణ్యాల ప్రసక్తిలేదు
అవ్వమరణిస్తే - పాపంఎవ్వరిది
నిజమేలే - వాదానికి
నలువైపుల నాలుకలు
ఆత్మవాదనను విడు
ధనంజయునిలా నడు
నిజమేలే - తత్వానికి
తళతళలు - తుత్తినియలు
నిజ జీవిత చక్రంలో నిలచిన
నిర్వికల్ప సమాధిస్థితి
మరణించిన వ్యక్తికి
మహా ప్రస్థానం.

# పాత్రధారి

జ్వాలా ముఖినై-
పుడమిని - బూడిదచేయను-
బూడిదని - భావించను.
మై మరచి-
కల్పనా జగత్తులో కాలిడను
జీవన కల్ప తరువును-
ఛేధించను.
పనికిరాని గతానికి ప్రాణం పోయను!
గతంలోనున్న ''మంచిని'' కాదనను!
లేనిదానిని ''నిలబెట్టి''
అమ్ముకొని - బ్రతకను-
నిరంతర, ప్రయత్న సాధనలో నిలచిన మనిషిని
నిర్విరామకృషిలో - నిలువెత్తు - పాత్రధారిని.
విశ్వసించని - నీతులను - బోధించను-
నిద్రపుచ్చిన - రాతలను - రాయను-
సాధించనివి-
శోధించను
రాని రాగము తీయను
లేని భూమిక వేయను

# ''బ్రహ్మ'' - సంతతి

తర్క విజ్ఞాన కర్కశ - మెరుగని-
తాత్త్విక ఘనులు.
దోపిడి - దోసగుల - కూపిరిపోయని
సాత్త్విక మునులు.
కలిగినదేదో - కళ్లకద్దుకొను-
స్థిత ప్రజ్ఞులు.

గొప్పకు - మెప్పుకు - గురుతే తెలియని-
ద్వంద్వాతీతులు.
ఎప్పుడు - ఎవరిని - దెప్పిపొడవని-
జ్ఞాన వేత్తలు.

కోరిక తీరిక - జీవిత మెరుగని-
కర్మయోగులు.
నోరే మెదపని తీరే బ్రతుకను-
శాంతమూర్తులు.

వికసన - విలువలె
మానవ జన్మను ''బ్రహ్మ'' సంతతి
భావికి - భాగ్యం
పుడమికి - పుణ్యం.

# అదృష్ట రేఖ

''అదృష్టం'' - కనబడనిది
దురదృష్టం - పంయిబడునది
హస్తరేఖలో
కృషిలేఖ
ప్రతిమనిషి - జాతకంలో
సేతగ - నిలుస్తుంది
రాదనుకొనునది - ఎదురైన అదృష్టం
లేదనుకొనునది - వచ్చిన దురదృష్టం
అదృష్టం - గుప్పిట్లో - ఇమడదు
దురదృష్టం - దాచిన దాగదు
తట్టబోయే అదృష్టాన్ని పోనీకు
పట్టజూచే శనిని - రానీకు
క్రియే - అదృష్టం
నిష్క్రియ - శని
ముందడుగు - అదృష్టం
వెనకడుగు - శని

# ఆనందం - విషాదం

గత స్మృతులు
స్ఫురణకువచ్చిన - ''స్ఫూర్తి'' -
నిజప్రవృత్తులు
ఎదురు తిరిగిన - ''ఆర్తి''
భవ బంధాల్ని దాటగలిగిన-
దారితప్పినబండి గాడిలోపడిన-
విశ్వం - చిక్కుప్రశ్నను విప్పగలిగిన-
''అంతరంగంలో'' నిలచిన చెప్పలేని ''ఆనందం''
''బయటదొరకని'' గొప్పదైన ''అనుభూతి''
సతితో పతి - పతితో సతి
కష్టసుఖాల్ - పంచుకొనుట
ప్రవృత్తి - బంధుత్వం
అమితానందత్వం.
మనసు - చెడిన - పుడమి - మసకచీకటి
మనసు - పడిన - విశ్వం - మకరసంక్రాంతి
వస్తురాశికి - వశమై
నిలవని అంశాలు
''ఆనందం'' - ''విషాదం''-
ఆత్మ సంజనితాలు
సూర్యోదయ సూర్యాస్తమానాలు
ద్వంద్వజగతిలో దర్శనీయాలు.

# ఆచార్యుడు

జన జీవితం - మరణం లేనిది.
మనిషి మనుగడ - తిరుగులేనిది.
తీర్పునివ్వగలవాడే
ఆచార్యుడు - పూజార్హుడ
ఎగిరిపడిన - అగ్నికణం
ఆరిన- ఇది మసిబొగ్గు
అది రగుల్కొనిన - అగ్గినిప్పు
నిగూఢత్వం - తెలిసినవాడే
ఆచార్యుడు - పూజార్హుడు
పంకజముఖిని - అంకమున నిడుకొను నరునిబుద్ధి
చంద్రునిలో మచ్చజూపిన అదే కోతిబుద్ధి
బ్రతుకుపున్నంలో చీకటిని
వెదుకువారికి వెలుగునిడిన
విజ్ఞాని - వివేకి
ఆచార్యుడు - పూజార్హుడు

అవివేక బలహీనత్వం - వెనుకబాటు
ప్రతిభాసామర్థ్యం - ముందడుగు
నిర్ధారణ జరిపిన
ఆచార్యుడే - పూజార్హుడు
ఆత్మశక్తి - అవనిధనం - స్థితప్రజ్ఞత - పుడమివరం
తెలిసికొనని - తెలివిలేమికి -
తేటపరచగలవాడే
ఆచార్యుడు - పూజార్హుడు
పుడమినితను జ్ఞాననిధియని-
తెలివితేటలు తనసొత్తని-
జ్ఞానం ఎల్లరికి అబ్బబోదని
ఆత్మవిద్య అందరికందదని
పలువురికి జ్ఞానం పంచిపెట్టని
ఆచార్యుడు - పూజకు అనర్హుడు
పుడమికి భారం - నరునికి శాపం

# కాంతి రేఖలు

నవ్వులు చిందే - పువ్వుల్లారా
ముద్దొలికే - సిరిమువ్వల్లారా!
కాంతికి మీరే - కనుపాపలు!
లోకానికి మీరే - కాంతి రేఖలు
సుందర భవితకు సూర్యునిలా!
నందన వనమున - చంద్రునిలా!
విరాజిల్లు ఈ విశ్వం మీదే!
గుణ కర్మలకు - గురుతులు మీరే!
తీర్పుకు మార్పుకి - మీరే వక్తలు!
కలిమికి - బలిమికి - మీరే శక్తులు!
జగతి జాగృతికి జన్మదాతలు!
దేశ - భవిత - నిర్మాణ - కర్తలు.

# మాయం

తటాకంలో
తలూపుతూ -
మిలమిల మెరసిపోతున్నావు!
అట్టడుగున బురదలో -
నీ కాలుందని
మరచిపోతున్నావు.
అందని - తీరాలను
చేరాలని - ఎగిరి పడుతున్నావు.
క్రిందకు దిగిరానిదే-
నీ గమ్యం నీకందదని
తెలియకున్నావు.
క్రిందవానికి - శూలంవేయు
చిందులు - త్రొక్కుతున్నావు.
మీదవాడు నీ బొందికి -
గేలం వేస్తాడన్నది
విస్మరిస్తున్నావు.

# గడ్డి బొమ్మ

విజ్ఞాని
సతికిల పడిన
సర్వజ్ఞుడు
అజ్ఞాని
నింగికెగసిన
గడ్డిబొమ్మ
ఎలక ఎగిరి ఎగిరి గంతేసిన
ఏనుగంత కాబోదు - సరిరాదు
కాకిలయతో - అడుగులో అడుగువేసిన
హంసగమనము - క్రిందరాదు - సరిపోదు
నిరక్షరుడే - ''అజ్ఞాని'' అని నిందమోపడం-
అక్షరుడే - ''విజ్ఞాని'' అని నిరూపించదలచడం
అంధకార యుగంలో-
అల్లిన కల్పనలు-
అక్షరుడైన - ''అజ్ఞాని'' లా ప్రవర్తించడం
నిరక్షరుడైన -''విజ్ఞాని'' లానిలద్రొక్కుకోవడం
ఆధునిక యుగంలో-
నిలచిన నిజాలు.

# ఆస్థానపీఠం

అసమానతల - గుట్టపంయి వెలసిన
హెచ్చుతగ్గుల కొలువుకూటంలో-
దిక్కుమాలిన బడిలో నేర్పిన-
మొక్కుబడి పాఠాల్ని వల్లిస్తున్నారు.
నేర్పినవారు - దిన భత్యంకోసం
దివ్వెను దిగతుడచిన వారు.
నేర్చుకున్నవారు
అన్ని బేరాలలో - ఆరితేరినవారు.
కొనుక్కొన్న అంతస్థులపై - కూర్చున్నవారు.
తార్కిక మేధాశక్తులకు
మేకులు వేయడం-
మానవ''చేతను''దెలిపిన''రాత''కు
మసి బూయడం-
''కర్మ''లో నిలచిన''గీత''ను
కట్టు కథగ - నడిపిస్తున్నది
మానవ సామ్రాట్ ను మరచిన
కలిపురుషుని - ఆస్థానపీఠం

# అడవి తల్లి

చూడు - చూడు - చూడు
అడవి తల్లిని చూడు
నరతోటనాడు నేడు
నలుగురికి నీడ తోడు- చూ.
కొండలలో - కోనలలో
కోటి కోటి దేవుళ్ళు-
కొండెక్కిన దేవునికి-
కొలువైన అడవితల్లి చూ.
పడగొట్టు - ప్రభుత్వాల్ని
నిలబెట్టు - రాజ్యాల్ని
చాటు మాటు మంతనాలకు
చోటునిచ్చె - అడవితల్లి చూ.
గద్దె విడచు రాజులకు
అద్దెయిల్లు అడవితల్లి
ఇల్లు విడచు భైరాగులకు
చల్లనిది అడవితల్లి చూ.

దాయాదులు పోరు సలప
దాగుందామని వారొస్తే
పాండవులకు నీడనిచ్చి
తోడుపడెను అడవితల్లి చూడు.

తండ్రిమాట నిలుపుటకై
శ్రీరాముడు తరలివస్తే
''సీతమ్మ వనవాసం''
పేరుగాంచె అడవితల్లి చూడు.

పండు ఫలం బుట్టవేసి
గండ్రగొడ్డలే తీసి
కొండను దిగ - భుజంకాసె
నిండు తనమే అడవితల్లి చూడు.

ప్రకృతి మాత నీళ్లాడితే
పురుడుబోయు అడవితల్లి.
ఆదిమ జనసంతతికి
అమ్మ+తల్లి - అడవితల్లి చూడు.

# సింహం - చిట్టెలుక

తామసి- ఒక చిట్టెలుక - సంపదపంయి చేయిసాచి,
అధికారపు - కంచెవేసి - తనమాట వేదమనె.
ఎత్తుగడల నక్కంత ప్రక్కగా జేరవచ్చి
సిరిమూటలు నీకున్న సింహనాదమబ్బదనె
సింహమనగ నాకెంత!- కలిమితోడ కట్టేస్తా.
అదివిని నక్కంత బెదరివెళ్లి
రాజసమున విర్రవీగు - గండుబిల్లిచెవిని వేసె.
జాతివైరి చిట్టెలుకను పట్టబోవ-
నక్కంత హెచ్చరించె-''వర్గ శత్రువను''చు
దుముక, అగ్గిలోన పడతావు.
చిట్టెలుకకు కాపలా''పొట్టుతిన్న'' వాళ్లెందరో-
జాతివాని పిలపించు మాసిపోవు చిట్టెలుక.

వద్దు - వద్దు - జాతికి జాతితెగులు
నీటికి నాచుతెగులు - హెచ్చరించె చెట్టుమీద చిలకపిట్ట.
నీచేతికి మట్టింటకనీవు - కథను నడపాలి.
నిదురించుసింహాన్ని నిద్రనుండి లేపు
పరులమీదకుసిగొల్పి - పంతమెల్ల తీర్చుకో.
చిలక నీతికెదురేమని!
సింహాన్ని తట్టిలేపె.
ఆవులిస్తూ - వళ్లువిరచి - కళ్లుతెరచి.
రాజసిక గండుబిల్లి - ''కండలాగె''
తామసిక చిట్టెలుకను ''మట్టివేసె''
కుమ్ములాట - బొమ్మలాట
తెరచించగ - తెల్లవారె.

# ఉండి-లేనిది - లేక ఉన్నది

అస్మిన్ సతి - ఇదం భవతి
విశ్వసృష్టికి - లేడు అధిపతి.
అది ఉండెను - ఇది కలిగెను-
అది లేనిచో - ఇది కలుగదు-
బుద్ధుని గతితర్కం
"అంతర్యామి"-విశ్వాధిపతి
బ్రహ్మసత్యం - జగన్మిథ్య
జీవో బ్రహ్మైవనోపర-
దేహాని స్థిరం - దేహమస్థిరం
జీవుడే దేవుడు.
శంకరుని భాష్యం
అహంకృతి-"ఆత్మాధిపతి"
ఒకరు నిరీశ్వరునిలో ఈశ్వరుని
ఒకరు ఈశ్వరునిలో నిరీశ్వరుని
అంతఃచక్షువుతో-
అరసిన ఆత్మవాదులే.
గీతలో - నిలచిన జగన్నేతను
విశ్వాంతర్యామిగ నిలిపినవారే
శరీరం కేవలం - "కర్మ"
క్షేత్రం - "జీవి"- క్షేత్రజ్ఞుడు - "జీవాత్మ"
ఉత్తమక్షేత్రజ్ఞుడు - "పరమాత్మ""అంతర్యామి"
కలడు - కలండెనిడివాడు - కలడు + లేడు.

# ఆత్మశక్తి

నిన్ను పడగొట్టిన - నిలబెట్టిన
నీ మనోఫలకమును - నిలచిన
నీ ఆత్మే - నీ శత్రువు
నీ ఆత్మే - నీ మిత్రువు
ఆత్మ - ప్రకాశించిందా! - నిరక్షరుని ఇంట
సరస్వతీప్రసన్నం - జరిగి - మురికిగుంటలో నిలచిన-
ముత్యమును వెలికి తీసి మెరిసేలా చేస్తుంది.
ఆత్మవినాశనం జరిగిందా!
అత్యున్నత స్థానంలో నిలచిన ఏ ఒకరినైనా
అధఃపాతాళానికి నెట్టుతుంది.
ఆత్మ - ఏ ఒకరి ఇంటా వంటా
అంటి పెట్టుకొని - తిరగాడేదికాదు.
ప్రతి ఒకరి ఇంటావంటా విరాజిల్లి గల
విశ్వ తేజస్సు - ''ఆత్మ''

మట్టిని మొలకెత్తించే - ''జీవశక్తి''

జీవుని నిలువెత్తుగ నిలిపే - ''ఆత్మశక్తి''

గాండీవం విడచిపెట్టి - సతికిల పడిన

జనుడ వనిపించుకుంటావు

గాండీవం - ధరించి - పాశుపతాస్త్రాన్ని

ఎక్కుపెట్టిన అర్జునుడనిపించుకుంటావు.

అధోగతికి - పురోగతికి - కర్మాధికారివి నీవే అయిన

సంధించిన - పాశుపతాస్త్రం -''జీవశక్తి'' అని భ్రమించావా!

చేతిలోనున్న గాండీవం - పట్టు తప్పుతుంది

గురిపెట్టిన పాశుపతాస్త్రం - దారి తప్పుతుంది

అర్జునుడవైన - మరల జనుడవుతావు సుమీ.

విడచిన పాశుపాతాస్త్రం - ''ఆత్మశక్తిగా'' భావించావా

గుండెబరువు తగ్గి - బండి నడుస్తుంది.

జనుని - అర్జునునిగ - నిలిపి - జాగృతి పరుస్తుంది.

# పశ్నార్ధకాలు

ఏమిటా సింహగర్జనలు!
పర్జన్యుని వర్షధారలు.
ఏమిటా పలకరింపులు!
గుండెల్లో విచ్చిన గునపాలు.
ఏమిటా - పిల్లి అరుపులు!
అతుకుల - బ్రతుకుల - కుదుపులు.
ఏమిటా పెద్దలువద్దన్నమాట!
చీకట్లో ముసుగుల - చిందులాట.
ఏమిటా - పలుకుల పరమార్ధం!
సుఖ దుఃఖాల అంతరార్ధం.
ఏమిటా - భక్తి శ్రద్ధలు!
ముక్తికి - భుక్తికి సరిహద్దులు.
ఏమిటా బొమ్మ - బొరుసు!
అదృష్టం - దురదృష్టం.
ఏమిటా పదార్ధం - భావం!
జీవి ఎత్తుగడ - ఆత్మవ్యూహం.

# ప్రజాగర్జన

సింహగర్జన - చిందులేయు
ప్రజాగర్జన - పంతమూనే
    లేడి తడబడి గంతువేసిన
    రేసులన్ని రెచ్చిపోయే
పంది దొర్లుచు- పరుగు తీసిన
చీమలన్ని బార్లుతీసాయి
కప్పగంతెడి కలుగుదూరిన
పాములన్ని పడగలిప్పాయి
    పిరికితనమే నరకు నిన్ను
  ''మనోధైర్యమే'' మహినిగన్ను
నిక్కినీల్గుచు - ప్రక్కజేరి
కూనిరాగాలె తీయుకోకిల
పాటచేదని - బ్రతుకు వాదని
తోకముడవక కాకి-లేచె-

కూడబెట్టిన చిరుఫలాలను
చిలక కొరుకుతు ఫలకరిస్తే
కుమిలి పోవక గుటక వేయక
పంతమూని పాలపిట్ట దాడిచేసె
పసిడి జలమున జలక మాడగ
పరమహంసలు కదలివస్తే
ఈత కొలనులో బాతులన్ని
జుట్టువీడక గట్టుచేరి
గట్టిగా ఎదిరించి నిలచే
సింహగర్జన చిందులేయ
ప్రజాగర్జన పంతమూనే-
అడవిరాజును బిరుదు పలకము
నూడదీసి విసరి వేసి
ప్రజలు రాజులు ప్రజాగర్జన
బిరుదు ఫలకము ప్రతిష్టిద్దాం.

# చిద్విలాసాలు - చిరునావహాలు

నాయకుడు - నాయకి
ఆకాశంలో-సగం - సగం
తనువు - మనసుల - సంగమం
అదుపు - తప్పని - ప్రకృతి - హద్దుమీరనిప్రవృత్తి
తనువుకి - మనసు - తలొగ్గుతుంది
మనసుకి - తనువు - తన్మయిస్తుంది
తిరస్కారం - పురస్కారం
తనువు - మనసుల - పరిష్కారం
బ్రతుకు బజారులో - దొరుకు భోగంకొరకు
ముడిసరుకు కాదు - మనసు తపిస్తుంది
చెలియలికట్టను - దాటనిది - చెలి
తనఒడి గుడిలో నిలచిన - కెరటం - తనువు జపిస్తుంది
తనువుకి - కసరత్- శరీర గుణం -''నిర్బంధం''
మనసుకి - ఆలోచన - మెదడు లక్షణం - ''స్వేచ్ఛ''
సుఖమిచ్చిన - పొందిన - తనే సూత్రధారి -''తనువు''
కొలువు కూటంలో తను పాత్రధారి - ''మనసు''
కీ ఇస్తే - కీలుబొమ్మను కానని -''మెదడు''
తను విదలించినదే - చైతన్యమే - లేదని ''శరీరం''
తనువు - మనసు - విడివడని
మంత్రబద్ధం - లయబద్ధం.

తనువుకి - సుఖం కావాలి
మనసుకి - తృప్తి - కావాలి
సుఖపడటానికి సూత్రాలున్న
తృప్తి పడటానికి అవధుల్లేవు
పునర్నిర్దేశానికి దొరకనిది
ప్రవృత్తి వైరుధ్యం
ప్రళయం - శివతాండవం
ప్రణయం - హరవిలాసం
తన ఇష్టం - కష్టం - తన స్థిరం
సమాజోపకరమైనవి - తనవి కావు
సరదాల సంగమం - సైకాలజికల్ క్లోజ్‌నెస్
బై లాజికల్ అర్జ్
అనురాగాల అనుబంధం - "ఆత్మ ప్రకాశిక"
"చైతన్య దీపిక".
గంగా యమువల్లా - పయనం
విడిపోలేరు - కలసిపోలేరు
రక్షణ వలయాన్ని ఛేధించిన
శిక్ష పడేది తనకే
ఇంతి ఆడుకొనే బంతియనిన
బజారున పడేది తనే
చిద్విలాసాలకు చిరునామాలున్న
వేర్వేరుగ వెలిగే దీపాలు కావు.
అభిరుచి - ఆత్మీయత
ఆడ (లు) మగల అధిపతులు
జనపథంలో వేరే
బీజం - క్షేత్రం.

# ఓ ప్రభూ

అంగడిలో నినుపెట్టి అమ్మజూపినవాని
ఆత్మలో నిన్నరసి - వేడుకున్నవాని
దుష్టుడని శిక్షింతువా ఓప్రభూ
శిష్టుడని రక్షింతువా ఓప్రభూ
దోపిడీ మరగిన దొడ్డమనిషిని గాంచి
చెమటోడ్చిజీవించు కష్టజీవిని చూచి
శపింయించ తలపడుదువా ఓప్రభూ
చేరదీయుగ దలతువా ఓప్రభూ!
కన్న కలచెరిగిన - కన్నెపిల్లను జూచి
పల్లకినూరేగు - పెళ్లికూతురిని జూచి
కృంగిపోవుచునుందువా ఓప్రభూ
పొంగిపోవుచునుందువా ఓప్రభూ

గద్దెలెక్కినవారు మిద్దెలలో తిరగాడ
ఎన్నొకొన్నవారు - ఏమీలేకను తిరగ
అభయహస్తము నిత్తువా ఓ ప్రభూ
అన్యాయమని అందువా ఓ ప్రభూ
తరిగి - పెరుగుతున్న జాబిల్లి దెసగాంచి
పెరిగి - తరుగుచున్న బాలచంద్రుని జూచి
హర్షమున పులకింతువా! ఓ ప్రభూ!
ఆత్మలో శోకింతువా ఓ ప్రభూ!
స్థిరరాశిలోనున్న దినకరుని దిస జూచి
తనచుట్టు తిరగాడు గ్రహరాశిని తలచి
జీవి స్థిరమని అందువా ఓ ప్రభూ!
జీవమస్థిరమందువా ఓ ప్రభూ!

# కర్మబంధం

''గంతల్ని''డుకొని తిరగాడిన ''గానుగెద్దుకు''
ముందడగు భ్రమ-వెనుకడుగు నిజం
తనకర్మ తన బంధం
తన బంధమె తన బ్రతుకు
కనువిప్పు కరువైన మనిషికి
''కర్మబంధం తప్పదు''
రెక్క విప్పి ఎగిరిన ''పక్షికి''
అనంత విశ్వంలో కాలిడు ''ఆత్మవిశ్వాసం''
తనకర్మ తనస్వేచ్ఛ
తనస్వేచ్ఛ తనబ్రతుకు
కనువిప్పు కలిగిన - మనిషికి
'' కర్మబంధం ప్రహాస్యసి''
తగుల్కొనేది- కర్మ- ''తప్పదు''
విదలించుకొనేది-జ్ఞానం-''సంభవం''
అద్వైతం- అనుభవం-''అనివార్యం''
''కర్మజ్ఞాన సముచ్ఛయ'' - ''జీవితం''
''పద్మపత్రమివాంభసా''- ''మార్గం''

# బ్రహ్మ సంకల్పం

అనుక్షణం - ప్రాణ భీతితో-
''పరీక్షిత్తునిలా''- బ్రతకను
తెలియని పద్మవ్యూహంలో పడి-
''అభిమన్యు''నిలా నిలవను
గురువును గ్రుడ్డిగ-
ఏకలవ్యుని లా - కొలవను.
నా జన్మకర్మ - నా కర్మఫలం.
''కర్మాధికారులం'' - మనమే అయిన
కర్మఫలధాత - మనగీత
కన్నతల్లి - ఒకరే అయిన
కర్ణుడు - విధివంచితుడు
అర్జునుడు - అదృష్టవంతుడు
ఒకరికి - ఉన్నకవచ - కుండలాలు
ఊడి పడ్డాయి
ఒకరికి లేని గాండీవం- పాశుపతాస్త్రం
వచ్చిపడ్డాయి.

ఇరువురివి - రాజపుట్టుకలే అయిన
ఆటపట్టులలో - వేర్వేరైనారు
తామసిక ప్రవృత్తి ప్రకోపింప - నివృత్తి-''సూతుడు''
రాజసిక క్రవృత్తికి నిరూపణ - నివృత్తి- ''రాచబిడ్డ''
ఇరువురిని కన్నతల్లి
కడుపుతీపి ఒకటే-
సాత్త్విక ప్రవృత్తి నివృత్తి
''బ్రహ్మాసంకల్పం''
ఒకరిని శిక్షించింది
ఒకరిని రక్షించింది
జీవనశక్తికి - ఆత్మశక్తి
జతకూడి - అతికినగాని
జన్మకు-జాగృతి-లేదు
కర్మకు-విముక్తి-రాదు.

# సంతలో - సంతర్పణ

సంతలో - సంతర్పణ -
వంతును - బడిగట్టాలని - ఒకే గెంతు.
సమాజ సంపదకందరు సామ్రాట్టులే కద.
దేవుని పెళ్లికందరూ పెద్దలుకద.
తినమరిగిన వాళ్లు - ఒక పంక్తి
తినటానికేమి లేనివారు - ఒక పంక్తి
కడుపు కక్కుర్తి - ఒకరిది
కడుపు మంట - ఒకరిది
వడ్డనలో పక్షపాతమా! దొడ్డి దారిన వడ్డనలా!
కొట్లాడు కోవద్దని కారణజన్ములు లేచారు
త్రొక్కిసలాడకండి -
తొణకిసలాడిన స్వర్గం తొలగిపోతుంది.
జనాలకున్నది జానెడుపొట్ట. ఎంతుకింత లట్టి - జట్టి.
తిని చావటానికి ఇన్ని తిప్పలా!

కాకమ్మ కథల్ని వినిపించకు

మేమే త్రేతాయుగం వారసులమా!

తీర్మానిస్తున్నాం తిరుగులేనిది మా విభజన
అవివేక బలహీనులకు మొదట వడ్డించాలి
తదుపరి మిగిలితే - ప్రతిభా సామర్థ్యాలకు పెట్టాలి.

రెండుపంక్తుల్లో నున్నవారు ఒక్కమారుగ లేచారు
వారిలో కొందరు వీరిలో- వీరిలో కొందరు వారిలో దూరారు
తినవచ్చిన వారిలో ఎవరెవరో తెలిసికోలేం
పనిచేసినపుడే ఎవరెవరో తెలుస్తుంది

''ఆదిపీట''-అవివేక బలహీనుతులకు-

''పెద్దపీట''-ప్రతిభాసామార్థ్యాలకు-
సమాజమున అవి అంతరిస్తేనే - ఇవి వికసిస్తాయి
వ్యక్తిలో ఇవి వికసిస్తేనే - అవి అంతరిస్తాయి.

# కూటి కోసం - కోటి విద్యలు

వేద విద్యలు - వెలుగు కొరకు-
కోటి విద్యలు - కూటి కొరకు.
ఆత్మవికసనకాది ''జ్ఞానం''
ఉనికి - మనుగడకాది - ''అన్నం''
అన్నమే - పరబ్రహ్మ అనిరి - ''జీవశక్తి''
జ్ఞానమే - సర్వార్థ మనిరి - ''ఆత్మశక్తి''
ఇహ పరాలకు జాడలివియే
ముక్తి - భుక్తికి - ''భక్తిశ్రద్ధలు.''
కాలగతిలో - ''మాట తెలివి''-
మాట మార్పే - మంతనాలు
కూటి కోసమే - కర్మయజ్ఞం
వెలుగు కోసమే - జ్ఞానయజ్ఞం

కర్మ పరులకు - కోటి విద్యలు.
కడుపు నింపెడి - సాధనాలు.
జ్ఞాన పరులకు - వేద విద్యలు.
ముక్తి నిచ్చెడి - మార్గాలు.
కర్మయోగమే - జ్ఞానయోగం
జ్ఞాన యోగమే - కర్మయోగం
బ్రహ్మమొకటె - జన్మ ఒకటె.
కర్మ - జ్ఞాన-మే - ''అనుభవం''
జ్ఞాన బ్రహ్మే జగతి రక్ష
ఆత్మ విస్తృతి - వేద విద్య.
జరుగు బాటులే జన్మ గతులు
కర్మ జాగృతి - వృత్తి విద్య.

ప్రజాకవి - వంగపండు
పెందుర్తి
విశాఖపట్టణం.